అర్థము. సామాన్యార్థిహితవితరణానందనం, సామాన్యార్థి = సాధారణులైన యాచకులయొక్క, హిత = కోరికలను, వితరణ = నెరవేర్చుటవలనైన ఆనందనం= సంతోషము, స్వేష్టలాభే = తనకోరికలను ముఖ్యమైన లాభముగ, విమలేయశసి = పరిశుద్ధమైన కీర్తివిషయమై (కీర్తిని సంపాదించుటకనుట), స్థిష్ణుతాం = స్థిరత్వమునుగూర్చియు, ఇష్టానాం = ఇంక నితరములగు కోరికలకును, నందనం = నందనవనము, స్యాత్ = అగును, యః = ఎవడు, స్వయం = తాను, చేతోహాసం = మనోవికాసమును, అనుభవన్ = పొందుచు. స్వాశక్యం = తనచేతనైనంతవరకు, యాచకేష్టం = యాచకులకోరికను, నోకుర్యాత్ = చేయడో, (అట్టివానికంటె), ప్రకృతికఠినః = స్వభావముచేత కఠినుడైన మనుజుడే, సాధుః = యోగ్యుడు, ఇత్యేవ = ఈలాగునని, మన్యే = తలచెదను.

తాత్పర్యము. లోకమున బుద్ధిమంతుడు తనకోరికలలో శాశ్వతమై నిర్మలమైనకీర్తిని సాధించుటకై మిగుల ప్రయత్నించుచుండును. అట్టి స్థిరతరమగు కీర్తినేకాక తదితరములగు వానియభీప్సితముల చేకూర్చుటవిషయములో సాధారణముగా యాచకులయొక్కయు నందనవనమునకు సమానుఁడగును. వారిమనోరథముల నెఱవేర్చుటయనునది కల్పవృక్షమువంటిదియగును. ఎవడు తాను సుఖమునమనుభవించుచుఁ జేతనైన యుపకారము యాచకులకుఁజేయడో వానికంటె క్రూరస్వభావముగలవాడే యోగ్యుడని తలచెదను. పరోపకారము సర్వశ్రేయోదాయకమనియు పరోపకారబుద్ధిలేనివాడు క్రూరుడనియు ముఖ్యతాత్పర్యము.

" ఆపన్నార్తి ప్రశమన ఫలాః సంపదోహ్యుత్తమానాం " అనెడి యక్షునివాక్యమును మనమున నాటించుకొనినవానివలెనే మేఘుడు వియోగతప్తుడగు యక్షునిమాటలు విని యీవిధముగ జింతించుట "జాతంవంశేభువనవిదితే పుష్కలావర్తకానాం " ఇదిమొదలుగాగల వీనియాభిజాత్య వర్ణనను స్ఫురింపఁజేయుచున్నది. మఱియు నుత్తములజాడగుటచే " యాచ్ఞామోఘావరమధిగుణే " యనెడి యక్షాభిప్రాయము స్థిరీకృతమైనది. ఈవిషయమును గురించి పద్మపురాణమున జెప్పబడిన " అశ్వమేధసహస్రాణి వాజపేయశతానిచ ।

శరణాగత సంత్రాణకలాం నార్హంతి షోడశీం ॥ దీనస్యోపేక్షణం కృత్వా భీతస్య చ శరీరిణః పుణ్యవానపి కాలేన కుంభీపాకే నపచ్యతే ” (ఉత్తరకాండ 181 అధ్యాయము) ఇత్యాదిధర్మశాస్త్రోక్తము ననుసరించియె మాట్లాడుచున్నట్లు కనుపట్టుచున్నది.

శ్లో॥ ప్రాణాన్దత్త్వారుచిరయశసాద్యాపి జీమూతవాహః ।
పక్షీంద్రాయోరగతతికృతేమౌనివర్యోదధీచిః ।
శక్రాదిభ్యఃప్రముదితహృదాస్వీయ కాయంహిదత్త్వా ।
పౌరస్త్యావివని వసతఃకింవదాన్యత్వకల్పం ॥

మ॥ మునుపక్షీంద్రునకిచ్చి ప్రాణముల హైవాపోషించెజీమూతవా
హనుఁడానాగులనాదధీచియును దేహంబీయఁడోవజ్రికిన్
మనియున్నట్టులె వారు గన్పడరెయీనాఁడున్ యశఃకాయులై
ఘనమైయొప్పెనె వాత్మతాగరిమశక్యంబే నుతింపన్ ధరన్ 3

అర్థము. జీమూతవాహః = జీమూతవాహనుఁడు, ఉరగతతికృతే = సర్పములసమూహము నిమిత్తమై, పక్షీంద్రాయ = గరుత్మంతునికొరకు, ప్రాణాన్ = ప్రాణములను దత్త్వా = ఇచ్చియు, మౌనివర్యః = మునిశ్రేష్ఠుఁడగు, దధీచిః = దధీచియనువాఁడు, ప్రముదితహృదా = సంతసించినమనస్సుతో, శక్రాదిభ్యః = ఇంద్రుడుమొదలుగాగలవారికి, స్వీయకాయం = తనశరీరమును, దత్త్వా = ఇచ్చియును, రుచిరయశసా = పరిశుద్ధమగుకీర్తిచే, అద్యాపి = ఇప్పటికిని, తౌ = వారిద్దరు, పౌరస్త్యావివ = ఎదుటనున్నవారువలె, నివసతోహి = ఉన్నారుగదా, కనుక, వదాన్యత్వకల్పం = దాతృత్వముతో సమానమైనది. కిం = గేమియున్నది. ఏమియు లేదని తాత్పర్యము.

తాత్పర్యము వెనుకటిశ్లోకమునఁ జెప్పబ[illegible] పరోపకారమచ్ఛంబగు కీర్తిఁ జేకూర్చి స్వవాంఛితములఁ దీర్పఁ[illegible] [illegible] పురాణప్రసిద్ధములగు నుదాహరణంబులచే వ్యక్తీకరించుచున్నాఁడు. జీ[illegible]హనుడు దేవతాజాతులలో నొకరగు విద్యాధరులకు చక్రవర్తి. గ[illegible]ఁడు పాములను దిన

ములవఱుసగా భక్షించుచుండ, జీమూతవాహనుఁడు దన ప్రాణములవానికి నాహారముగ నొసఁగెనని నాగానందమను నాటకమునఁ బ్రసిద్ధము. వృత్రాసురునిఁ జంపుటకు దేవేంద్రుఁడు దధీచి మహామునిని బ్రార్థింప నాయన తనవెన్నెముక నతిధైర్యముతో నీఁగా, నద్దాని నాయుధముగఁ జేకొని శత్రుసంహారముగావింప గల్గెనని భాగవతకథ. కావున వారిరువురు కీర్తిచే నిప్పటికి నిబ్రతికియుండిన వారివలె లోకమునఁ దలంపఁబడుచున్నారు కావున దానమునకుసాటి మఱియొకటి లేదని తెలియుచున్నది. (మఱియు వదాన్యత్వముత్తమనాయకలక్షణములలో నొకటి) కావున నేను వర్తమానము చెప్పి యక్షస్త్రీప్రాణదానముఁ జేయగలుగుటచే, స్వల్పకార్యముచేత నే, అనగా, దధీచిమొదలగువారివలెఁ దమ ప్రాణములఁ గోల్పోకయె, (మేఘుఁ డుదకస్వరూపుఁడు గాన మాటమాత్రముచేత నేయని తాత్పర్యము) ప్రాణదానఫలము నాకు సంభవించుచున్నది. కావున దాతృత్వముతో సమానము మఱియొకటిలేదుగదా. "మేఘసందేశమున ప్రత్యాసన్నేనభసి దయితా జీవనాలంబనార్థీ" యని చెప్పినట్లు యక్షుఁడు తనప్రియురాలి జీవితము విషయమయి భయపడుటకు కారణము వర్షఋతుప్రాప్తియొకనుకను, "మేఘాలోకే భవతిసుఖినోప్యన్యథా వృత్తిచేతః" అని మేఘుఁడే యక్షయక్షాంగనల సంతాపమును హెచ్చరించిన వాఁడగుటవలనను తా నేవారికిఁదప్పక తోడ్పడవలెనన్నట్టిట్లు చింతించుచున్నాఁడు. "జీమూతవాహనుఁడన మేఘవాహనుఁడు అనగా నింద్రుఁడని యర్థము, కావున తనువాహనముగాఁగల వానికిట్టి ఖ్యాతిగలుగ తానుగూడ నట్టిదానికై ప్రయత్నించుచుండుట భావ్యమని లక్షణయా స్ఫురించుచున్నది. దూతయగువాఁడు ధీరోదాత్తుడైయుత్తమ నాయకుఁడై యుండుట రామాయణాది మహాకావ్య ప్రసిద్ధము.

శ్లో॥ జీమూతం మాంనిగదతిజనస్సర్వదాఖర్వభావా
దర్థిత్వస్సాన్వర్థః పరమవహితప్రేక్షణాదక్షిణేన
స్వాభిఖ్యానం నయతినచనద్వ్యక్తి యాదృచ్ఛికత్వం
తస్మాన్నోకింపరమసుహితం ప్రాణిభోజ్యం శరీరం ।

## ఘనవృత్తే

ఉ॥ జీవనదాతయంచు నను జెప్పుదు రెప్పుడవక్రబుద్ధిచేఁ
గావఁగ నౌనుగా దెతమకంబును బొందనివానిచేత మో
దావహమా నిజాఖ్యను నిరర్థమొనర్పక కాచువాని దే
భావన సేయ జీవనము ప్రాణుల భుక్తికిఁ గాదె దేహముల్ ॥ ౪.

అర్థము. జనః = లోకమందు జనుఁడు, సర్వదా = ఎప్పుడును, అఖర్వభావాత్ = వంకరస్వభావము అనగా కుటిలత్వము లేకుండుటచే, మాం = నన్ను, జీమూతం = జీవనమునకు (ఉదకమునకని యూహ యర్థము) ఆధారమని, నిగదతి = చెప్పుచున్నాడు, పరం = మిక్కిలి, అవహితప్రేక్షిణా = జాగరూకతతో సంచరించునట్టి, దక్షేణ = సమర్థునిచేత, స్వార్థః = తనబిరుదము (అనగా తన నామముయొక్క యౌగికార్థము) రక్ష్యః = కాపాడుకొనఁదగినది, సమ్యక్తి = వ్యుత్పత్త్యర్థముగల, స్వాభిఖ్యానం = తన పేరును, యాదృచ్ఛికత్వం = హఠాత్ప్రాప్తత్వమును (అనగా వ్యుత్పత్తి లేకుండుటను) నయతి = ఎవఁడు పొందింపఁడో, తస్మాత్ = అంతకంటె, అసుహితం = ప్రాణములకిష్టమగు, పరం = అన్యవస్తువు, నోకిం = లేదుగదా. శరీరం = శరీరమైతే, ప్రాణిభోజ్యం = కాకాదిజంతువులచేతినదగినది, భవతి = అగుచున్నది. అని అధ్యాహారము.

తాత్పర్యము. లోకములోనన్ను జీమూతమను ప్రసిద్ధనామముచేఁ బిలుచుచుందురు. జీమూతమనఁగా, జీవనస్య, మూతః = పుటబద్ధః జీమూతః అని కాన్పించుచున్నది. జీవనమనగా నీళ్లనియు, ప్రాణములనియుఁ గూడ నర్థము. కావున జలదుఁడు ‹‹ ధూమజ్యోతిస్సలిల మరుతాం సన్నిపాతః ›› అనుటచే నీళ్లనిచ్చువాఁడే కాక ప్రాణములనిచ్చువాఁడు నగుచున్నాడు. లోకములో బుద్ధిమంతుఁడు తన నామమును సార్థకము జేసికొనఁ బ్రయత్నింపవలయును కావున జీమూతుఁడనగు నేను యక్షదంపతుల కన్యోన్యకుశలవార్తాద్వారా జీవనమిచ్చి, యందువలన సార్థకనాముఁడను గావలెను. వ్యుత్పత్తిసిద్ధమగు తన నామము నెవఁడు సార్థక్యము నొందింపఁడో వాడు తనకే యహితమును జేసికొన్నవాఁ డగుచున్నాడు. మరణానంతరము కాకాది జంతువుల పాలగు నీశరీరము

శాశ్వతమగు కీర్తి కంటె నెక్కువకాదు. కావున సర్వదా పరోపకారము చేయుట ముఖ్యమని తాత్పర్యము.

మేఘుఁడిట్లు తనపేరును సార్థక్యము నొందింపవలయునని చింతించుట, కాళిదాసుని పూర్వమేఘమున యక్షుని “దయితా జీవనాలంబనార్థీ జీమూతేన స్వకుశలమయీం హారయిష్యన్ ప్రవృత్తిం” అనుదానిలో సరిపోవుట వలన “జీవనార్థం కర్మ జీవనప్రదేనైవ కారయితవ్యం” అను యక్షుని యాశయమును గ్రహించినవానివలెఁ గన్పట్టుచున్నాడు. బుద్ధిమంతులు పరేంగితజ్ఞానముకలవారుగదా.

శ్లో॥ ఇత్యాద్యాత్మన్యమృతసదనే సంవిచింత్యాంబువాహః
కర్తుంమిత్రేప్సితకృతి మథోయత్నవాన్సంబభూవ
కోవానస్యాత్ ప్రణయవశతో యాచమానే వయస్యే
శక్యంకార్యంస్వగతి వశత స్సాధితుంసప్రయత్నః ॥

చం॥ జలధరుఁడిట్లు నెమ్మదివిచారణ మిక్కిలిచేసిచూచివ్యా
కులుఁడగు మిత్రుకోర్కె సమకూర్పఁగనెంచియొనర్చె యత్నముల్
గలుగఁగశక్తి యాప్తుఁడతికష్టములంబడి వేఁడుచుండఁభూ
వలయములో నెవండయిన వానికిసాయమొనర్పకుండునే ॥ ౪

అర్థము. అంబువాహః = మేఘుఁడు. అమృతసదనే = అమృతాశ్రయమైన, ఆత్మని = మనస్సునందు, ఇత్యాది = పైనఁజెప్పినరీతిని, సంవిచింత్య = ఆలోచించి, అథో = తరువాత, మిత్రేప్సితకృతిం = యక్షునియిష్టకార్యమును, కర్తుం = చేయుటకు, యత్నవాన్ = ప్రయత్నముగలవాఁడు, సంబభూవ = ఆయెను, ప్రణయవశతః = స్నేహవశమువలన, వయస్యే = చెలికాఁడు, యాచమానే = ప్రార్థించినవాఁడగుచుండఁగా, శక్యం = తనచేతనైన, కార్యం = పనిని, స్వగతివశతః = తనశక్త్యనుసారముగా, సాధితుం = చేయుటకు, సప్రయత్నః = యత్నముతోఁ గూడినవాఁడు, కోవానస్యాత్ = ఎవఁడుకాఁడు?

# ఘనవృత్తే

తాత్పర్యము. మేఘుఁడు పైఁజెప్పినట్లుగా ననుకొని యక్షునికోర్కె-దీర్పఁ దలపెట్టెను. స్నేహముంబట్టి తనకు స్వాధీనమైన యొకపనిని జేయు టకుఁదనచెలికాఁడు కోరఁగా, యథాశక్తి నెవఁడుచేయ బ్రయత్నింపఁడు.

ఈశ్లోకమున 'నమృతపదని' యనుటవలన నుదకమునకే స్థానమగుట కాక, యమృతమునకు స్థానమనియు, అనగా మోక్షసాధకమనియు స్ఫురించుచుండుటవలన, యమృతపదవిపునరావృత్తి రహితమగునటుల, నమృతపద ముఁడగు మేఘునిచే ననుకూలత నొందింపఁబడిన యక్షయక్షాంగనలును చిరకాల సౌఖ్యము ననుభవింపఁగలరని భావికథనుసూచించుచున్నది. మేఘుఁడిట్లు కృతనిశ్చయుఁడగుట పూర్వమేఘమున యక్షుఁడామ్రకూట విషయమై చెప్పిన "నక్షుద్రోపి... సంశ్రయాయ, ప్రాప్తేమిత్రే భవతివిముఖఃకింపునర్యస్తథోచ్చైః" అనువాని యభిప్రాయమును బలపఱచుటే కాక, "తేనార్థిత్వంత్వయివిధివశాద్దూరబంధుర్గతోహం" యనిపద్యమున యాచించిన యక్షునికోరిక తప్పక సాఫల్యముఁ జెందునని తెలియఁజేయుచున్నది.

" స్వగతివశతః " కాలక్రమమున నాయలకా పట్టణమునుందనకు గమ్యస్థానంబగుటచే దైవేచ్ఛవలన సంప్రాప్తంబైన యీపుణ్యకార్యమును చేయుటకై కొంతశీఘ్రముగఁ బోవుటకు " యత్నవాన్ " ప్రయత్నింపఁ గృతనిశ్చయుఁడయ్యెను.

శ్లో॥ నిర్గచ్ఛన్ సత్రిదివవసతింపర్వతేనానుయాతం
వీణాక్వాణాంతరితశకునిశ్రేణినాదాంతరాళం
ధాత్రీంకాఙ్క్షాకరరుహాలసత్పుండరీకం మునీంద్రం
పశ్యన్నివ్యప్రిద్వ్యయమహితికాలోక దృష్టార్థసిద్ధిం ॥

మ॥ చనువాఁడై త్రిదశాలయంబునకు సత్సాన్వంతుండు మేఘుండుపా
వనునిర్ఝరపర్వతమిత్రయుక్తు మహతీధ్వానాతిసంఛన్నవ

## ప్రథమస్సర్గః

క్షనినాదర్తాసరసిరుహానలసత్ స్వీయాంకపద్మాకరో
త్కానదబ్జుంగనికార్యపూననుచు మోదస్వాంతుండయ్యె వేనన్

అర్థము. సః = ఆమేఘుఁడు, నిర్గచ్ఛన్ = ప్రయాణోన్ముఖుఁడై వెళ్లుచు, త్రిదివవసతిం = స్వర్గమునుగూర్చి, పర్వతేన = పర్వతుడనుమునితో, అను యాతం = కూడుకొనినట్టియు, వీణాక్వాణా...రాళం, వీణాక్వాణ = తన వీణధ్వనిచేత, అంతరిత = అణచివేయఁబడిన, శకునిశ్రేణినాద = పక్షులవరుసల చేఁగలిగినధ్వనిగల, అంతరాళం = ఆకాశముగలిగినట్టియు, ధాత్రంకా...రీకం, ధాత్రంక = బ్రహ్మతొడయందు, అబ్జాకరరుహ = సరస్సునందుపుట్టిన, లసత్ = ప్రకాశించుచున్న, పుండరీకం = తెల్లఁదామరయైనట్టి, మునీంద్రం = నారదమహామునిని, పశ్యన్ = చూచుచు, విప్రద్వయమహతికాలోక దృష్టార్థ సిద్ధిః, విప్రద్వయ=ఇద్దరుబ్రాహ్మణులయొక్కయు, మహతికా=నారదునివీణెయొక్కయు, ఆలోక = చూచుటచేత, దృష్టార్థసిద్ధిః = నిశ్చయింపబడినస్వకార్య సిద్ధిగలవాడై — ముందరిశ్లోకమునకన్వయము.

తాత్పర్యము. కుబేరుని పట్టణమునుగురించి వెడలనుంకించు మేఘునకు ప్రథమమునఁ గలిగిన శుభశకునములఁ జెప్పుచున్నాడు. మేఘుఁడు ప్రయాణ మైపోవునపుడు, పర్వత నారదులు స్వర్గమునకు వెళ్లుచు, వీణెవాయించుకొను చు, ఎదురుపడఁగనిరువురుబ్రాహ్మణులును, వీణెయుగనఁబడినశుభశకునములచేఁ గార్యసిద్ధియౌను సుమాయని సంతోషించినవాఁడాయెను

ఈశకునములు పూర్వమేఘమున యక్షుడు వీనిమార్గమును చెప్పుచు "మందంమంద" మిత్యాదికముచేఁజెప్పిన శకునముల స్మరణకుఁ దెచ్చుచున్నవి శకుని శ్రేణినాదము "వామశ్చాయం నదతిమధురంచాతకః" అని యక్షుడు చెప్పినట్లుగా, మేఘుని వెంబడించి మధురముగా నాదముచేయుచున్న చాత కముల ధ్వనియెయనియు, నారదసందర్శనము తలవని తలంపుగాఁబ్రాప్తించిన మణియొక్క శుభసూచకమనియుం దెలియవచ్చుచున్నది. "ధాత్రంకాబ్జా...కం" బ్రహ్మదేవుని తొడయందుఁబుట్టినమాటవలన, వయోనిజుఁడనియు, పుండ రీకశబ్దము తెల్లతామరయందు రూడముగాన తెల్లనివాఁడనియు, మునీంద్రశబ్దము చేత దేవర్షియనియు, తోఁపించుచున్నది.

శ్లో॥ ఏతౌదృష్ట్వాసవినయమతిస్సంప్రక్లృప్తప్రణామ
స్తద్దత్తాశీర్వచనఫలిత ప్రాయహృద్యార్థసిద్ధిః
గత్వాఽగ్రేసత్ఫలభరనమద్భూరుహంశ్లిష్టవల్లీం
ప్రాపామోదంనిరుపమమసావుత్తరాశాంయియాసుః ॥ ౬ ॥

ఉ॥ వారలఁగాంచిసద్వినయభావమునన్ బ్రణుతించిదీవనల్
వారలొసంగఁదానుఁజనువాంఛఫలించిన యట్టులెంచిసద్వీరు
ధమొండుజుట్టుకొనఁ బెల్లుగఁబండినఁబండ్లనమ్రమహా
భూరుహమున్ గనుంగొనుచు మోదముతోఁజనెనుత్తరాశకై.

అర్థము. ఏతౌ = ఈమునీంద్రులను, దృష్ట్వా = చూచి, సవినయమతిః = అణఁకువతోఁగూడినబుద్ధిగలవాఁడై, సంప్రక్లృప్తప్రణామః = చేయబడిననమస్కారముగలవాఁడై, తద్దత్తాశీర్వ...సిద్ధిః, తద్దత్త = వారిచేనియ్యబడిన, ఆశీర్వచన = ఆశీర్వాదముచేత, ఫలితప్రాయ = నెరవేరినట్టుగానున్న, హృద్యార్థసిద్ధిః = ఇష్టమైనకార్యసిద్ధిఁగలవాఁడై, ఉత్తరాశాం= ఉత్తరదిక్కునుగూర్చి, యియాసుః = వెళ్లనిచ్ఛగించినవాఁడై, అగ్రే = ఎదుటను, శ్లిష్టవల్లీం= అల్లుకొనినతీగలుగల, సత్ఫలభరనమద్భూరుహం = మంచిపండ్లయొక్క భారముచేవంగినవృక్షమును, గత్వా = పొంది, నిరుపమం = సాటిలేని, ఆమోదం = సంతసమును, అసౌ = ఈమేఘుడు, ప్రాప = పొందెను.

తాత్పర్యము. ఆమేఘుడు, పర్వతనారదులకు మిక్కిలి యడఁకువతో నమస్కరించి వారిచ్చిన యాశీర్వాదముచేఁ దాఁజేయఁబోవు యక్షాంగనాప్రాణదానకార్యము సఫలమగునని నిశ్చయించి, ఉత్తరదిక్కుగా ప్రయాణమై, యెదుట తీగలచేఁజుట్టుకొనఁబడిన చాలపండ్లుగల చెట్టునుచూచి దంపతుల కిట్లే సంగమమును, సుఖప్రాప్తియు గాఁగలదని తలంచినవాఁడై చాలసంతోషించెను.

యక్షుఁడు “ మార్గం తావత్ శృణు కథయతః ” అని ముందు మేఘుఁడు పోవలసిన మార్గమును జెప్పి తరువాత సందేశమును చెప్పెను. ఆమార్గము-చెప్పుటలో “ పరిణతఫలద్యోతిభిః కాననాన్తైః ” ఇత్యాదుల నానవాళ్లు-

చెప్పుటచేతను, ఇప్పుడు మేఘుడు తనమార్గమున “ ఫలభరనమద్భూరుహా ” ములఁజూచుటచేతను, మరియు “ ఉత్పశ్యోదఙ్ముఖఃఖం” అను మొదలుగ యక్షుఁడు చెప్పిన మార్గదర్శకములగు వాక్యములను జ్ఞాపకముంచుకొని, తదనుగుణంబుగ “ఉత్తరాశాంయియాసుః” ఉత్తరదిక్కునుగూర్చి వెళ్లనిచ్ఛగించినవాఁడగుటచేతను, మేఘుడు తనమార్గమున సరిగఁదెలిసికొని యక్షుఁడు చెప్పినత్రోవనె వెళ్లియుండునని యూహింపఁదగియున్నది. “ సవినయమతిః ” అనుటవలన మేఘుడు పెద్దలయందు గౌరవముగలవాఁడనుచు వానియాభిజాత్యమును తెలియఁజేయుచున్నది. ఇకముందరను యక్షాంగనవీని ప్రథమమునఁజూచి “ సుతవది వామాం ప్రేక్షతే ప్రశ్రియేణ ” యనుటవలనను, యక్షవృత్తాంతమామెకుఁజెప్పమొదలుపెట్టి నప్పుడు “సంగతప్రశ్రియః” డనుట వలనను వీనిప్రశాగుణము ప్రసిద్ధమగుచున్నది. “ శ్లిష్టవల్లి ” ఇది భావిశుభమును సూచించుచున్నాభిప్రాయవిశేషణము. వల్లీశబ్దము స్త్రీలింగము. భూరుహశబ్దము పుంలింగము చుట్టుకొన్న తీగెలుగల వృక్షమనుటచేత, దంపతులకు భావికాలమున ప్రాప్తించులతావేల్లిత బంధనాదిసుఖములను వీరియొక మర్త్యమమితం బైయుండు ననియు సూచించుచున్నది.

శ్లో॥ తత్ర ద్యక్షోదితనగపురీద్వీపవత్యాదిలక్ష్మీ
ప్రాప్తామోదః పథిననిరతంప్రాపయక్షేశగుప్తాం
యక్షస్త్ర్యాలోకత్వరితహృదయస్సద్గురోస్సద్మశిష్యో
వానిశ్శంకంసురపతి పురస్పర్ధినీంరాజధానీం ॥ ౭ ॥

ఉ॥ యక్షునిజేతఁజెప్పఁబడినట్టి పురీవరపర్వతాదులన్
వీక్షణసేసిత(దమకుఁ బ్రీతినిఁజెందుచుమార్గమందునా
యక్షపరక్షితంబగుచు నాయమరావతిమించునప్పురిన్
యక్షినిఁజూడనేగెగురుహర్మ్యము శిష్యుఁడుచొచ్చునట్లు వడిన్.

అర్థము. పథి = మార్గమందు, తత్ర ... మోదః, తత్ర త్ = ఆయా, యక్షోదిత = యక్షునిచేతఁజెప్పబడిన, నగపురీద్వీపవత్యాది = కొండలు, పట్టణములు, నదులు మొదలగువానియొక్క, లక్ష్మీ = సంపత్తునుండి, ప్రాప్త

మోదః = పొందబడినసంతోషముగలవాఁడై, సః = ఆమేఘుఁడు, విరతం = ముఖ్యముగా, యక్షస్యాలోకత్వరితహృదయః = ఆయక్షుభార్యనుచూచుటయందు తొందరగలమనస్సుగలవాఁడై, సద్గురోః = గురువుయొక్క, సద్మ = గృహమును, శిష్యోవా = శిష్యునివలె, నిశ్శంకం = సందేహములేకుండునట్లుగా, సురపతిపురస్పర్థినీం = ఇంద్రపట్టణముతో సమానమగు, యక్షేశగుప్తాం = కుబేరపాలితమైన, రాజధానీం = అలకాపట్టణమును, ప్రాప = పొందెను.

తాత్పర్యము. మేఘుఁడా యక్షుఁడు చెప్పినదే వగిర్యాదులగు కొండలను, శ్రీవిశాలయగు విశాలాపట్టణము మొదలగు పట్టణములను, గంగచర్మణ్వతి మొదలగు నదులను మార్గమునబోవుచుఁజూచి, యక్షునిచే వర్ణింపఁబడిన వాని వాని సౌభాగ్యమును స్వయముగాఁ జూచినవాఁడగుటచే మిగుల సంతోషభరితుఁడయ్యెను. కాని వీనిఁజూచి సంతోషించుచు కాలయాపనఁ జేయుట వీనికి తగవు కాదు "దినసగణనాతత్పర" యైయాయక్షకాంత ప్రియసమాగమమునకై వేచియుండును. కావున నే మార్గమున నాలస్యము చేయవలదని "గంతుమాశువ్యవస్యేత్" అనియు "స్థిత్వాతస్మిన్వనచరవధూ భుక్తకుంజే ముహూర్తం" అనియు "ధ్వానదానాత్ క్షణపరిచితః" యనియు యక్షుఁడు మేఘుని సాధ్యమైనంత త్వరగ ప్రియురాలికి వార్తగొంపొమ్మని చెప్పియంపెను. దీనరక్షణము సాధువులకు సహజముగావున, నీమేఘుఁడును వియోగదుఃఖపీడితయగు నాయక్షియెట్లుండునోయని "యక్షస్యాలోకత్వరితహృదయుఁడై కుబేరునిచేఁ బాలింపబడుచున్న నాయలకాపట్టణముఁ జేరను

శ్లో॥ తేనోక్త్రాదప్యధికవిభవం వీక్షమాణఃపురీంద్రం
శశ్వజ్జాతాద్భుతనముదయస్సంప్రహృష్యన్నితాంతం
ప్రిజ్ఞానాళీవిలసనపరిజ్ఞాతతద్గేహభాగ
స్త్రస్థో హైమావృతినలపదంతద్గృహంమన్యమానః ॥ ౮ ॥

ఉ॥ అతనియుక్తికన్న విభవాతిశయంబుల నొప్పుచుండివి
ఖ్యాతినిఁబొందినట్టియలకన్ గనిమాటికిమాటికాత్మసం

జాతములై నవింతలకునంతసమందుచు మంచుకప్పుకం
జాతములౌ లుతద్గృహముచాయ నెఱింగెఁ దదుక్తి నెన్నుచున్ ॥౯॥

అర్థము. తేన = ఆయక్షునిచే, ఉక్తాదపి = చెప్పఁబడినదానికంటె, అధికవిభవం = మిక్కిలియైశ్వర్యముగల, పురేంద్రం = పట్టణశ్రేష్ఠమును, వీక్షమాణః = చూచుచున్నవాఁడై, శశ్వత్ = సారెసారెకు, జాత = పుట్టిన, అద్భుతసముదయః = ఆశ్చర్యాతిశయముగలవాఁడై, నితాంతం = మిక్కిలి, సంప్రాప్య = సంగ్రహించినవాఁడై, ప్రజ్ఞాన = గుర్తులయొక్క, ఆలీ = వరుసయొక్క, విలసన = కనఁబడుటచేత, పరిజ్ఞాత = తెలియఁబడిన, తద్గేహభాగః = ఆయక్షగృహముండు వైపుగలవాఁడై, హైమావృతనలపదం, హైమ = మంచుచేత, ఆవృత = కప్పఁబడిన, నలపదం = పద్మముయొక్క రీతిగలదానిని, తద్గృహం = వానియింటినిగా, మన్యమానః = తలఁచినవాఁడై, తస్థౌ = అచట నుండెను.

తాత్పర్యము. ఆయక్షుఁడు చెప్పినదానికన్న నాపట్టణము మిగుల సౌందర్యముగలదై గొప్పయైశ్వర్యముతోఁ గూడియుండెను. ఆపట్టణమునుఁ జూచి నకొలది హెచ్చుచున్నయాశ్చర్యముగలవాఁడై, వెనుక యక్షుఁడు తనకుఁ జెప్పిన గుర్తులచే (అనగా క్రీడాశైలము, బాలమందారవృక్షము, మాధవీమంటపము, తన్మధ్యస్థమగు కాంచనవాసయష్టి, ఆగృహముయొక్క వాకిటనున్న శంఖపద్మములు మొదలగువానిచే) నది యక్షగృహమని గుర్తించి, యక్షుఁడు చెప్పినప్రకార మచ్చట క్రీడాశైలమందలి సానువులమీదఁ గూర్చుండెను. అప్పుడు వానికాగృహము మంచుచే నావరింపబడి కాంతిహీనమగు పద్మములుగలదై శోభలేకయుండిన సరస్సువోలెఁ గాన్పించినది. భర్తయింటలేనందున నాయక్షకాంతగృహమును సింగారింపమంటచే కాంతిహీనమని తాత్పర్యము. ఉత్తరమేఘమున యక్షుఁడే తనగృహమిట్లు కాంతితగ్గియుండుటను " క్షామచ్ఛాయం భవనమధునా మద్వియోగేన నూనం " అని చెప్పి, యట్లుండుటచేత నీ యది తన గృహమని గుర్తింపవచ్చునని యుఁ జెప్పియున్నాఁడు. " శశ్వజ్జాతాద్భుతసముదయః" అనుటవలన (ఉ మే.1) "విద్యుత్వంతం" ఇత్యాదిశ్లోకములయందలియక్ష వర్ణనకంటె నాపట్టణము, మేఘుఁడు సమీపించుటవలన " ముక్తాజాలగ్రథితమ

లకంకామినీవాభ్రబృందం "(పూ.మే.67) అనువట్ల మిత మగు శోభగలదై ప్రకా శించుచుండుటవలన వశ్యాశ్చర్యమును పొందినవాడని తెలియుచున్నది. " హై మావృతవలపదం " అనునది యక్షుఁడు తనగృహమును గూర్చి చెప్పుచు " నూర్యాపాయేనఖలుకమలం పుష్యతిస్వామభిఖ్యాం " అని తానులేకుండుటచే గృహముకాంతి విహీనమైయుండునని సూచించుటను స్థిరీకరించుచున్నది. " పరిజ్ఞాతతద్దేహ భాగః " అనుటవలన మేఘుఁడు తనకు యక్షుఁడుత్తర మెఘమున " గత్వాసద్యఃకలభతనుతాంశీఘ్రసంపాతహేతోః " అనెడి శ్లోకమునఁజెప్పినసంగతిని మఱవక, తద్గృహోపాంతమున నుండు క్రీడాశైలముమీదనే యుండి మణిమయ బహిర్ద్వారాది చిహ్నములచే నాగృహముండు ప్రదేశమును తెలిసికొనినవాఁడై " తస్థౌ " యనుటవలన నాక్రీడాశైలమందే నిలిచినవాఁడై యుండెనని భావము. " గేహ భాగః " యనుటవలన మేఘుఁ డలకాపట్టణమునకు రాత్రిసమయమునఁ జేరియుండవలయుననియు, రాత్రియగుట వలననే యాగృహమును స్పష్టముగా శంఖచక్రాది చిహ్నములచే గుర్తించుటకు వీలులేక, మణిమయకవాటంబుచేతనో, దగ్గరనుండు క్రీడాశైలము, దిగుడుబావి మొదలగువాని సన్నివేశముచేతనో తద్గృహముండు ప్రదేశమును మాత్రము కన్గొనినవాఁడైయుండునని తెలియుచున్నది.

శ్లో॥ శ్రీదేవ్యాస్తచ్చరణకమలధ్యాన నిర్వృత్తచిత్తా
హృత్తాపార్తావివృతనయనా ప్రేయసః కల్యవార్తాం
వ్యాఖ్యాతారంనియమసమయప్రాప్త హర్షానుకూలం
సాంద్రాక్షీత్తంజలధరమథోచింతయామాసచైవం ॥

ఉ॥ శ్రీజగదంబపాదసరసీరుహ సేవనిరస్త తీవ్రహృ
ద్బాధనపూర్ణ తాప పరితప్తయునై యటువిప్పి కన్నులం
భోజనిభాస్యచూచి ప్రియుమోదపువార్తలఁజెప్పుచుండఁగా
నాజలదుందలంచెసతిధ్యాన ఫలంబిదియంచునాత్మలోఁ ॥౧౦॥

అర్థము. సా = ఆయక్షకాంత, హృత్తాపార్తా = మనోవ్యథచేబాధితయై, శ్రీదేవ్యాః = పరదేవతయొక్క, తత్ = ప్రసిద్ధమైన, చరణకమల =

పాదపద్మములయొక్క, ధ్యాన = స్మరణచే, నిర్వృత్తచిత్తా = సుఖించినమన స్సుగలదగుచు, పివృతవయసా = కన్నులువిప్పినదై, ప్రేయసః = ప్రియుని యొక్క, కల్యవార్తాం = కుశలసమాచారమును, వ్యాఖ్యాతారం = చెప్పు చున్న, తం = ఆ, జలధరం = మేఘుని, నియ...లం, నియమసమయ = ధ్యానకా లమందు, ప్రాప్త = సంభవించిన, హర్షా = సంతోషముననుు, అనుకూలం = తగునటుల, అద్రాక్షీత్ = చూచెను. అథో = తరువాతను, ఏవం = ఈప్ర కారము, చింతయామాసచ = ఆలోచించెను.

తాత్పర్యము. శ్రీపరదేవతా ధ్యానముచే, భర్తృవియోగమువలనఁ గలిగిన మనస్తాపము కొంత చల్లారినదై నప్పటికి, నావిరహదుఃఖంబమితంబగుట వలనను, మేఘుఁడాసన్నంబగుటవలనను, (వర్షఋతువు వచ్చినను‌ట) వృద్ధినొంది నహృదయతాపముగలదై, తనభర్తకుశల వార్తఁ జెప్పుచున్న మేఘునిఁ జూచి దేవీధ్యానమువలనఁ గలిగిన సుఖముగ నెంచుచు నీప్రకారము చింతించెను.

“ నిర్వృత్తచిత్తా ” యనుటవలన నికముందు ద్వితీయసర్గలో నీయక్షాం గనయొక్క చెలికత్తెచేఁ జెప్పఁబడెడి, కుబేరుని భార్య యరుదెంచి యోదార్చి లలితనుపదేశించుటయు, నాదేవీయుపాసనముఁ జేయుచున్న నీమెకాపరదేవత ప్రత్యక్షంబై యచిరకాలముననే శుభముగలుగునని చెప్పినుటయు నందువలన ననీమె శాంతచిత్తయగుటయు మొదలగు వృత్తాంతమును సూచించుచున్నది. మఱియు నదియాశక్త్యుపాసనయందీమెకుఁగల నైష్ఠికతయు, తదేకతానత్వమును మేఘసందేశమున నీమె కారోపింపఁబడిన విప్రలంభశృంగార చెష్టాదికము నకుతోడు, ఇప్పుడు భక్తిరసాధికతయు, పాతివ్రత్యలక్షణంబులును స్ఫుటీకృ తములగుచున్నవి. ఈమెయొక్క యుపాసనాదికమువలన చిత్తవైకల్యముపోయి మనము నిర్మలతఁ జెందినను వియోగమువల్లనైన హృదయసంతాపము చల్లార లేదు. కావుననే విషయవాంఛలను వదలి “ త్యక్తలోకప్రచారా ” (౨ సర్గ ॥శ్లో॥ ) భర్తృసమాగమమునకై జూచుచు నియమముగలదై దేవీపూజగా వించుచున్నది. ఇదియే యామెపతిభక్తిని, దేవతాభక్తినిఁగూడ చాటుచున్నది.

“ వ్యాప్తాపారా ” యనునది “ పవాన్యపారామ హానివతధ్యాటిడయేద్వి ప్రయోగతః కేరాఃతాగుడుతరకుచంబిర్వినోదాంసుఖ్గతా” (ఉ. మే. ౨౫ శ్లో॥) అను

యక్షవాక్యానుసరణముగ, సకలంతయు ««ఆలోకే తే నిపతతి పురా సా బలివ్యాకుల వా»» యన్నట్లుగ దేవీపూజావ్యగ్రురాలై యుండుటవలన శాంతచిత్తయై యుండినను, రాత్రియందామె హృదయము పరితాపముఁ బొందియుండవచ్చు ననియు కావున నిడియామెదౌ రాత్రియవస్థను తెలియఁజేయవచ్చుననియుఁ దోచుచున్నది. «« నిశామపమయు... కాలం »» ఈయష్టాంగవ యాపరదేవతాధ్యానము సల్పినపుడే తనయభీష్టము చేకూరఁగదాయని యెట్లు సంతోషముచే మైమఱచునో ఇప్పుడు మేఘుఁడు తనభర్తకుశలవార్త చెప్పుచు కనఁబడగా నామెకట్టి యానందము కలిగిననుట. «« అద్రాక్షీత్ »» పైశ్లోకమున «« తస్థౌ »» అని క్రీడాశైలమునిద నుండెనని చెప్పఁబడిన మేఘు నాయక్షకాంత యెట్లుచూచి యుండునని యాక్షేపము గల్గవచ్చును. కాని మేఘుడు క్రీడాశైలము సమీపించి, గజశిశువువంటి దేహమును అనగా «« గత్వాసద్యః కలభతనుతాం శీఘ్రసంపాతహేతోః »» అని యక్షనిర్దేశప్రకారమల్పదేహత్వమును పొందినవాడై ««అర్హస్యంతర్భవనపతితాం విద్యున్మేషదృష్టిం»» (ఉ మే. 21 శ్లో॥) అని యక్షుఁడు చెప్పినాడుగనుక విద్యుద్దృష్టితో చూచియుండును. అప్పుడు «« రాత్రౌ గురు తరశుచం నిర్వినోదాం »» «« నిశీథతామున్నిద్రామవని శయనాం »» ( ఉ. మే. 28 శ్లో॥ ) అనియు యక్షుఁడూహించినట్లుగా రాత్రినిర్వ్యాపారయై మిగుల దుర్భరమగు దుఃఖము ననుభవించుచున్న నాయక్షకాంత వానికిఁ గన్పట్టియుండును, కావున భర్తయొక్క కుశలవార్తఁ జెప్పి యామె నోదార్పుటకుఁ దగుసమయమిదియే యని యెంచి «« మత్సందేశైస్సుఖయితుమలం పశ్యసాధ్వీ నిశీథే »» ( ఉ. మే. 28 ॥శ్లో॥ ) అని యక్షుఁడు చెప్పినవాఁడుగాన, నామెపరుండియుండుగది కిటికిటిలోఁజేరి కామరూపుఁడుగావున పురుషాకారమును ధరించినవాడై భ్రాతకుని కుశలవార్తఁ జెప్ప మొదలుపెట్టెను. అమెయు «« విద్యుతనయనా »» మేఘ్యానియేయున్నది గావ వానిని కన్నులెఁదఱచి చూచినదై యీక్రిందచెప్పబోవుప్రకారము చింతింపఁదొడఁగెను.

ఇట్లని రామాయణమునను మారుతాత్మజుఁడు నశోకపాదపముఁ జేరి జనకాత్మజకుఁ, దన్నుతా నాలింగించుకొనుటకుఁ బూర్వమే «« కథంనుఖలు వాక్యంమే శృణుయాన్నోద్విజేత వా »» యని తలంచుకొని «« రామమక్లిష్టకర్మా

ణంస్వబంధుమనుకీర్తయన్, నైనాముద్వేజయిష్యామి " యని తలఁచి " రాజా దశరథో నామ " ఇత్యాదికముచే రామకథాసంకీర్తనముఁ జేసి, క్రమముగా తన్నుఁదానెఱింగించికొని యుండుటవలన, నిచ్చట మేఘుఁడు నట్లుఁజేసియుం డుటను స్ఫురింపఁ జేయుచున్నది.

శ్లో॥ నేదంనిద్రాజనితవికృతిర్లోచ నోత్ఫుల్లతాయా
న్నాయంకశ్చిజ్జన ఇతిమతిర్దుర్గమంఖల్వగారం
మాయాసారాన్మదనవశగః కోపిసంప్రాప్తఇత్య
ప్యస్థానేయత్సుతవది హమాంప్రేక్షతేప్రశ్రయేణ ॥

చ॥ ఇదికలగాదుమేలుకొనియే కదయుంటినిదుర్గమంబునా
సదనముదొంగసొచ్చుటకు శక్యమెయెవ్వఁడొ మన్మథార్తుఁడై
మదమునఁబన్నుకుచ్చితఁపు మార్గమునన్ జనుదెంచెనన్నన
య్యదియిటుఁగానరాదు వినయంబునఁబుత్రుఁడుగానన్ గనున్ ॥

అర్థము. లోచనోత్ఫుల్లతాయాం = నేత్రవికాసము గలుగుచుండగ, ఇదం = ఇది, నిద్రాజనితవికృతిః = నిద్రవలనగలిగినవికారము, న = కాదు అయంకశ్చిజ్జనఇతి = వీడెవఁడోయొక (దొంగ) మానిసియని, మతిః = బుద్ధియు, న = కూడదు, అగారం = ఇల్లు, దుర్గమంఖలు = చొరశక్యముకాదు గదా, మాయాసారాత్ = మాయాబలమువలన, మదనవశగః = మన్మథాధీనుఁడై, కోపి = ఎవఁడో, సంప్రాప్తఇత్యపి = వచ్చినవాఁడనుమాటయు, అస్థానె = తగియుండలేదు, యత్ = ఎందువల్లనంటే, ఇహ = ఇపుడు, సుతవత్ = కుమారుఁడువలె, ప్రశ్రయేణ = అణఁకువతో, మాం = నన్ను, ప్రేక్షతె = చూచుచున్నాడు.

తాత్పర్యము. ఆగదికిటికీలోనుండి వర్తమానముఁ జెప్పమొదలుపెట్టిన మేఘునిఁజూచి యెవఁడోయని ఆశ్చర్యపడుచు నిట్లని చింతించె.

నేను కన్నులు తెఱచి చూచుచునే యుంటిని గాన నిది స్వప్నము గాదుకదా. మఱియు నీగృహము దుర్గమంబగుటవలనచో రాదులిందుఁ జొర లేరు. ఇక నెవఁడో మదాంధుఁడై నన్నుకామించి మాయాబలిమిచే నిచ్చటఁ

జేరియుండుననుకొనుటయు పొసగదు. ఏలయన నాయందు మిక్కిలి యడఁకువ గలవాఁడై కుమారునివలె నన్ను సవిస్రంభంబుగఁ జూచుచున్నాడు

“ నిద్రాజనితవికృతిర్న ” అనునది యీమె భర్తృవియోగముచేత నిద్దురవలనఁ గలుగువికారములైనఁ జెంతరానిచ్చుట లేదనుటవలన నామెయొక్క జాగ్రదవస్థను సూచించుచున్నది. “ దుర్గమం ” వీనిగృహమునకు “ హరశిరశ్చంద్రికాధౌతహర్మ్యా ” అని యీశ్వరనివాసము సామీప్యంబగుటవలన దుష్టులకుఁ జొరశక్యముగాదనుట. “ సుతవత్ ” అనుటవలన “ అవితథగతిర్ద్రిష్ట్యసి భ్రాతృజాయాం ” అని అన్నగారిభార్య తల్లితో సమానురాలనియు భావించుట సహజమనియు, గాన నీవు నిశ్శంకముగ నెదుటకుఁబోయి నాకుశలవార్త జెప్పుటకుఁ దగియుండుననియు, యుక్తాభిప్రాయమునకు సరిగా, మేఘుఁడు (తల్లి కేదైన శుభవర్తమానమును జెప్పునప్పుడు కుమారుడు తినవుగల్గు విసయవిస్రంభములచే నుప్పొంగుట సహజమెగాన) నామెయెదుట కామరూపుఁడగుటచే పుత్రస్వరూపమును ధరించి వినయాతిశయముచే నీమెకు గన్పట్టుటవలన దౌత్యలక్షణములు వీనియందు గలవనియు సంధులకు తగియుండుననియు స్పష్టీకరించుచున్నది. ‘ప్రశ్రియేణ’ రామాయణమందెన్నఁబడిన దూతలక్షణములు వాయుపుత్రునియందు వలెనే వీనియందు గన్పట్టుచున్నవి. “ మాం ప్రేక్షతే ” ఇతరచింతమాని యామెపాతివ్రత్యమున కాశ్చర్యముతోను, ఆనందముతోను యీమెనె జూచుచున్నాడని తాత్పర్యము.

శ్లో॥ మద్ధ్యాతాయాంభువన సదనప్రాంచితాయాం శివాయాం
సానుక్రోశాత్మనిభువి పరంకన్యకిందుర్లభంస్యాత్
దృష్టేపుణ్యాత్సురవరత రాకోనయాతీప్సితంత
ద్భర్త్రాసీతఃప్రభవతుచరస్స్వోక్తిసంజీవితాశః ॥

ఉ॥ లోకములన్నృహాంతరములోపల వాసముచేయుతల్లితాఁ
జేకొనినాదు పూజదయచేఁ జెలువొందనలభ్యముండునే
నాకమహీజముగ గనమనంబునఁ గోర్కెలుతీరకున్ననా
వ్యాకులతఁ హరింపఁబతిపఁపినదూతయయీతఁడాసుమా ౧౨

అర్థము. మద్ధ్యాతాయాం = నాచేధ్యానింపబడినట్టియు, భువనభువన పాలించితాయాం = సమస్తలోకపూజ్యురాలైనట్టియు, శివాయాం = పరదేవత, సానుక్రోశాత్మని = దయతోగూడినమనస్సుగలదగుచుండగా, కస్య = ఎవనికి, కిం = ఏది, దుర్లభం= లభింపశక్యముకానిది, స్యాత్ = అవును. పుణ్యాత్ = చేసికొనినపుణ్యమువలన, సురతరతరా = కల్పవృక్షము, దృష్టే = చూడబడిన దగుచుండగా, కః = ఎవఁడు, ఈప్సితం = కోరినను, నయాతి = పొందడు. తత్ = ఆహేతువువలన, స్వోక్తిసంజీవితాశః = తనమాటచేజీవింపఁజేయబడిన ఆశః = (నాయొక్క) ఆశగలవీడు, భర్త్రా = పెనిమిటిచే, నీతః = పంపబడిన, చరః =దూత, ప్రభవతు = అగుగాక.

తాత్పర్యము. నేనుపాసించుచున్న సకలలోక సంచారిణియైన పరదేవత దయార్ద్రచిత్త గావున నెవరికి నేదియు దుర్లభంబు గాదు. ఆమెయను కంపము నకు పాత్రులగువారికి సర్వమును సాధ్యమనుట. పుణ్యవశమున కల్పవృక్షము నాశ్రయింపగలిగిన వారికోరికలు సాఫల్యముఁ జెందకుండునా. కావున నన్నుతనమాటలచే నోదార్చుచున్న వీడు నాభర్తచేఁ బంపఁబడిన దూతయై యుండవలెను.

« సానుక్రోశాత్మని » అనుటవలన, ద్వితీయసర్గయందీయమ చెలికత్తెచే జెప్పఁబడు నాపరదేవతప్రత్యక్షమును « మత్కారుణ్యాత్ ... భోక్ష్య సేభవ్య భోగాన్ » అనునాపరదేవతావాక్యమును స్మరించుచున్నదై, ఈయమ త్వాంగన తదభీష్టసిద్ధికై యనుక్షణ మెదురుచూచుచున్నదానివలె గన్పట్టుచున్నది. « భర్త్రానీతః » ఇది « ప్రత్యాసన్నవభసిదయితా జీవనాలం బనార్థి » యని తనభర్త తప్పక తనకుశలవార్త బంపునని యూహించినదానివలెనే కన్పట్టు టచేత, వారిపరస్పర గాఢానురాగమును సూచించుచున్నది. « స్వోక్తిసంజీవి తాశః » భర్తృవియోగమువలన జీవితమందాశవదలియున్న నాయికకు « ఆశా బంధఃకుసు మసదృశంప్రాయశోహ్యంగనానాం...రుణద్ధి » యనునట్లు « భోక్ష్యసేభవ్యభోగాన్ » అని పరదేవతా వాక్యమందలి విస్రంభంబు భర్త్రు పునరాగమకాలనిరీక్షణమం దామెకాశను మాత్రముగలిగించినది. అట్టియాశ చె

నీమె జీవితయైయుండ మేఘుని శుభవర్తమాన మీ మెజీవితమందలి యాశకు పత్తువనిచ్చినది.

శ్లో॥ నేతుర్దూతో యదికిముపరిస్యాదితి ప్రాప్తధైర్యా
తద్వాగ్వృత్తి శ్రవణ విముఖీచింతయంతీపరాం తాం
సఖ్యాక్లృప్తైవిమలశయనే నిక్షిపంతీశరీరం
చింతాజాతాంబకసలిల సంపూర్ణకర్ణాధిశిశ్యే ॥

ఉ॥ వరుఁడిటుపంపుదూతయయి వచ్చిననాపయిఁజూతునంచు దా
స్థిరమతియూను మేఘుఁడటు చెప్పప్రవృత్తి వినంగనొల్లకే
శరణనిశక్తి ధ్యానమును సల్పుచు సెజ్జనమర్పుదూతికల్
పరగున మేనుఁజేర్చెఁగనులంగల నీరముచేరఁగర్ణముల్ ॥ ౧౩.

అర్థము. నేతుః = భర్తయొక్క, దూతో యది = దూతయయినచో, ఉపరి = ఇకముందు, కింస్యాత్ = ఏమియగునో చూతమని, ప్రాప్తధైర్యా = పొందబడిన ధైర్యముగలదై, తద్వాగ్వృత్తిశ్రవణవిముఖీ = వానిమాటలువినుటలో విముఖురాలై, తాంపరాం = ఆపరదేవతను, చింతయంతీ = ధ్యానించుచు, సఖ్యా = సఖురాలిచే, క్లృప్తె = కల్పింపబడిన, విమలశయనె = శుభ్రమగుపక్కయందు, శరీరం = దేహమును. నిక్షిపంతీ = ఉంచినదై, చింతా = భర్తృస్మరణమువలన విచారముచే, జాత = పుట్టిన, అంబకసలిల = కన్నీళ్లచె, సంపూర్ణ = నిండిన, కర్ణా = చెవులుగలదై, అధిశిశ్యే = పరుండెను.

తాత్పర్యము. వినయనమ్రత్వాది గుణములచే నొప్పుచున్నవీడు, తనభర్తచే పంపబడినవాడౌనని నిశ్చయించినది. గనుక నే ధైర్యము తెచ్చుకొని, యీమేఘుడు చెప్పబోవుచున్న వార్తనువిననొల్లకయే, ఆపరదేవతను మనమున ధ్యానింపదొడగిన దయ్యెను. పిమ్మట భర్తృస్మరణమువలన గలిగిన దుఃఖముచే వివశురాలై కన్నీళ్లు నించునాయక్షకాంత, తనచెలికత్తియచె నమర్చబడిన పక్కయందు పరుండెను. అట్లు వెల్లకిల పరుండుటవల నామెకన్నీళ్లు ధారలుగట్టి చెవులవరకు ప్రవహించెనని తాత్పర్యము.

« నిక్షిపంతీ » యనుపద యక్షభర్తృవియోగమున విరహాతురతనొంది చుచు శోచ్యమాని భూమియందె పరుండెనుండువని « అవనిశయనాం » అని యక్షుఁడూహించినదానితోఁ సరిపోవుటే గాక, యా మెదుఃఖమతిదుర్భరమని సూచించెను « శయ్యోత్సంగనిహిత మసకృద్దుఃఖదుఃఖేన గాత్రం » మను వానిమాటను సార్థక్యము నొందించుచున్నది. « చింతాజాతాంబక పక్తిల » యనుపద ఉత్తరమేఘమున « తామేవోష్ణైర్విరహమహతీమశ్రుభిర్యాపయంతీ » అనియక్షుఁడు మేఘునితోఁ చెప్పి «ప్రత్యక్షం తే నిఖిలమచిరాద్భ్రాతరుక్తం మయా యత్ » అని ప్రత్యక్షముగనే శీఘ్రముగఁ జూచెదవని పలికినందులకు, మేఘుఁడు శీఘ్రముగనె యట్టిదుఃఖము ననుభవించుచున్న యా యక్షిణిఁ జూచుట పైఁజెప్పినవాని మాటలతో సరిపోవుచున్నది. « ప్రాప్తధైర్యా » పెనిమిటి శుభవర్తమానము చెప్పుచున్న మేఘుని జూచినతోడనే « శేదంద్రాజనిత » యను శ్లోకముచేఁ జెప్పబడిన చోరమాయా పురుషాది సంశయముచేఁ జెడిన ధైర్యముగలదైయను, అతని వినయాదులచేతను, పరమేశ్వరి పూర్వము తనకొసంగిన వరముచేతను, పెనిమిటిచే బంపబడిన దూతయే యితఁడని విశ్వాసముచే ధైర్యముకలదయ్యెననుట « శ్రవణవిముఖీ » ప్రియవర్తమానము విశదముగ వినదలఁచినదై యను, కృతజ్ఞతాపూర్వకముగ పరదేవతాధ్యానాధిన మనంబుగల దగుటచే నప్పుడు విముఖురాలయ్యెను.

శ్లో॥ శయ్యాతస్యానయన సలిలోద్గార సంసిచ్యమానా
స్యైత ద్గాత్రపరిభవపృథుసంతాపజాశ్యానభావా
కందర్పేణవ్యపగత దయోత్సృష్టబాణౌఘతాప
శ్రీసంవృద్ధింవ్యరచయది వక్లేశమస్యాశ్చకార ॥

ఉ॥ కనుగవనశ్రువుల్ వెడలఁగాఁ దడిదైనను బూల సెజ్జయుఁ
దనువునఁబుట్టు తీవ్రతర తాపము చేతను వాడిపోయిని
ర్ఘృణతను మారుఁడేయు శరబృందసమృద్ధిని జూపి
ఘనమగు తాపమొయ్యెడల గల్గనఁ జేసె విచారమెంతయుఁ.

అర్థము. తస్యాః = ఆయక్షకాంతయొక్క, శయ్యా = పక్క, నయ

శపలిలోద్గారసంసిచ్యమానాపి = కన్నీళ్లుగారుటచేతదుపఁబడినదైనప్పటికి ఏతద్గాత్ర = ఈమెశరీరమునుండి, ప్రభవ = పుట్టిన, పృథు = విస్తారమైన, సంతాప = వేడిమివలన, జ = కలిగిన, ఆశ్యానభావా = ఎండిపోవుటగలదై కందర్పేణ = మన్మథునిచే, వ్యపగత = పోయిన, దయ = కరుణకలుగునట్లు, ఉత్సృష్ట = విడువఁబడిన, బాణౌఘ = బాణసమూహముయొక్క, తాప = వేడిమి, యొక్క, (శ్రీ)సంవృద్ధిం = మిక్కిలిఅతిశయమును, వ్యరచయదివ = చేసినదానివలె, అస్యాః = ఈమెకు, క్లేశం = విచారమును, చకార = చేసెను.

తాత్పర్యము. అప్పుడామె పరుండియున్నపక్క, కన్నీళ్లచేఁదడిసినదైనప్పటికి, నామెశరీరమందలి వేడిమిచేత మిగుల నుష్ణముగలదయ్యెను. ఆయుష్ణము తాపోపశమనంబునకై పుష్పపల్లవాదులచే గల్పింపబడిన శయ్యయందు గల్గుటవలన, క్రౌర్యమువహించిన పుష్పబాణుని తీవ్రబాణములయొక్క ప్రతాపాగ్నిచేత నసునట్లతిశయముగు తాపము నొనరించెను.

“ గాత్రప్రభవసంతాప ” యనుటవలన విరహావస్థలలో తొమ్మిదవదియగు నీమెయొక్క సంజ్వరావస్థ సూచింపబడుచున్నది. “ చక్షుఃప్రీతిర్మనస్సంగస్సంకల్పోఽథ ప్రలాపితా । జాగరః కార్శ్యమరతిర్లజ్జాత్యాగోఽథ సంజ్వరః । ఉన్మాదో మూర్ఛనం చైవ మరణం చరమం విదుః ” అని ద్వాదశావస్థాపక్షమున సంజ్వరావస్థతొమ్మిదవదిగా జెప్పఁబడియె. “ సంవృద్ధి ” విరహులకు తలిరులసెజ్జయు, చల్లతెమ్మెరలు, పండువెన్నెలలు, నుద్దీపనవిభావనలని యలంకారశాస్త్రప్రసిద్ధము. అందువలననే శైత్యోపచారమైనను తాపమును వృద్ధిజేసిన దని భావము “ నవకిసలయ తల్పంపుంజితాంగారకల్పం ” అని కాళిదాసాదులప్రయోగప్రసిద్ధము.

శ్లో॥ నఖ్యావీతంతదుచిత తమంసమ్యగానీయమోదా
ద్వత్తాస్త్రైర్వాపవిశిఖశివన్మండలే దర్పణస్య
ఇత్యాభావ్యప్రియతమకథా కర్ణనాలోలచిత్తా
వశ్యాంతీతంనుతిమివతదా వ్యాజహారప్రియోక్తిం ॥

మ॥ సకియొక్కర్తుక యోగ్యపీఠ మిడవత్సాయింపు గూర్చుండుమా
ముకురాంతర్గతచంద్రబింబమువలె న్మోదంబు చేసంచు వే
ప్రకటింపన్ప్రియువార్తధాశ్రవణము న్వాంఛించియా మేఘుబు
త్రిపురీరీతి గనె యక్షకాంత ప్రియవాక్ప్రారంభసంరంభయై॥

అర్థము. సఖ్యా = చెలికత్తియద్వారా (చేతను) తదుచితతమం = అతనికిబాగుగతగినట్టి, పీఠం = ఆసనమును, ఆనీయ = తెప్పించి, తత్ర = బిడ్డా, దర్పణస్య = అద్దముయొక్క, మండలె = బింబమందు, (ప్రదేశము) శశివత్ = చంద్రునివలె, అత్రైవ = ఈపీటమీదనే, ఉపవిశ = కూర్చుండుమా. ఇతి = ఈలాగునని, మోదాత్ = సంతోషముతో, ఆభాష్య = చెప్పి, ప్రియతమ = భర్తయొక్క, కథా = వృత్తాంతముయొక్క, ఆకర్ణన = వినుటయందు, లోల = ఆసక్తిగల, చిత్తా = మనస్సుగలదై, తం = ఆమేఘుని సుతమివ = కుమారునివలెను, పశ్యంతీ = చూచుచున్నదై, తదా = అప్పుడు, ప్రియోక్తిం = ఇంపైనమాటను, వ్యాజహార = చెప్పెను.

తాత్పర్యము. తరుణపురుషుని యాకారము ధరించిన యామేఘునికి నర్హమగునొక యాసనమును తనచెలికత్తెచేఁ దెప్పించి, యాయక్షి, తనప్రియుని కుశలవార్త వీనివలన వినఁగలుగుదుఁగదాయని సంతోషించుచు, నోయీ ఒకచిన్నయద్దమందుఁ బ్రతిఫలించుచున్న చంద్రునివలె నీపీటమీద గూర్చుండుమా, యని పలికి, తనకత్యంత ప్రియుఁడైన యాయక్షుని వృత్తాంతముఁ దెలిసికొన నాతురతఁ జెందుచున్న మనస్సుగలదై, యేదోయొక ప్రియముగు వర్తమానముఁ జెప్పవచ్చుచున్న కుమారునిఁ జూచుతల్లివలె సవిస్రంభంబుగను, సానునయంబుగను మేఘునివంకఁ జూచుచు, నిట్లు ప్రేమతో బలికెను.

“ తదుచితతమం ” ప్రియసందేశమించుక చెప్పవచ్చిన మేఘునియందలి గౌరవముచే శ్రేష్ఠమైన గద్దియ నొసఁగననుట. యక్షుని కుశలవార్తా శ్రవణముచే జీవితాశయగు నీయక్షి యిట్లు మేఘుని సత్కరించుట. “ త్వాముత్కంఠోచ్ఛ్వసితహృదయా వీక్ష్యసంభావ్యచైవ ” (ఉ. మే. 39 శ్లో.) అనుయక్షుని మాటలను క్రియారూపమున వ్యక్తీకరించుచున్నది యని తెలియుచున్నది. అతిరు

అవినయమై ప్రయోజనానుసారముగ గౌరవముంచుట రాజధర్మము. "వత్స" యనుటవలన నిక్కముందు 29 వ శ్లోకమున జెప్పబోవుకీలిని, మేఘసందేశమున "కామరూపం" అనుదానికి సరిగా మేఘుఁడీ మెగృహమును పురుషాకృతితోఁ బ్రవేశించెనని తెలియుచున్నది. "సఖ్యా, అనీయ" సఖియను కరణముచే తానే తెచ్చినది యనుటవలన, ఆమె చూపిన ఆదరము వినయము ప్రకటనయగు చున్నవి. "శశివదుపనిశ" ఈమె తెప్పించిన యాసనము కొద్దిపాటిదైనను చంద్రుఁడు చిన్నయద్దమందైనను ప్రతిఫలించురీతిని, దీనినాదరమున స్వీకరింపుమా యనుటవలన నామె వినయాతిశయమును తెలియఁ చేయుచున్నది. ఘటియు నాతనిదర్శన మామెకు చంద్రదర్శనమువలెనే హృదయాహ్లాదకరమ నియు సూచించుచున్నది. "సుతమివ" యనుటవలన భర్తృదం తముఁ జెప్పవచ్చిన మేఘునియందాదరమును, విశ్వాసమునెగాక యామె పాతివ్రత్యమును వెల్లడిఁజేయుచున్నది. "ప్రియతమ మకరధ్వకర్ణ నాలోలచిత్తా" యను పది యుత్తరమేఘమున "పవనతనయం మైథిలీవోన్ముఖీసా తాముత్కంఠోచ్ఛ్వసితహృదయా (ఉ. మే. 39 శ్లో.) యను యతువాక్యముల స్మరింపఁజేయు చున్నది.

శ్లో॥ ప్రాగేతస్మాత్ప్రమయత ఇతంప్రాణనాథస్యభవ్యం
శ్రుత్వాతీవప్రగత విలసజ్జీవితప్రత్యయాస్మి
ప్రాణేశస్యప్రమదచరితాఖ్యానదానాదిదానీ
మన్నే నేవవ్యపగతశుచంశర్తు మర్హాస్యజస్రం ॥

చ॥ జలధరయిప్పుడీవు ప్రియుసౌఖ్యముఁ జెప్పఁగవింటిఁ బ్రాణముల్
గళితముగావటంచుమది గట్టిగనమ్మితి నాథుమోదవా
ర్తలవివరించిరోగికిబలం బొనగూర్పఁగ నిచ్చుపథ్యముల్
బలెమదిగల్గుదుఃఖమును, నాశమొనర్పఁగ నీవెదిక్కుకర ॥౧౬॥

అర్థము. ఏతస్మాత్ సముద్యతః ప్రాక్ = ఇంతకుముందు, ఇతం = నీచేఁ జెప్పఁబడిన, ప్రాణనాథస్య = భర్తయొక్క, భవ్యం = కుశలవార్తను, శ్రుత్వా = విని, అతీవ = మిక్కిలి, ప్రగత = సంభవించిన, విలసత్ = ప్ర

తాపించుచున్న, జీవిత = ప్రాణమందు, ప్రత్యయా = విశ్వాసముగలదానను అస్మి = అయితిని. ప్రాణేశస్య = నాప్రాణనాధునియొక్క, ప్రముదచరిత = సంతోషమైనవార్తయొక్క, ఆఖ్యానదానాత్ = చెప్పుటవలన, ఇదానీం = ఇప్పుడు, అన్నే నేవ = అన్నముచేతనలెనే, వ్యపగతశుచం = పోయినదుఃఖముఁగలదానివలె, కర్తుం = చేయుటకు, అజస్రం = మిక్కిలి, అర్హసి = తగియుందువు.

తాత్పర్యము. ఇంతవుముందు అనఁగా నీవర్తమానము వినుటకుపూర్వము, నీచేఁజెప్పఁబడిన నాప్రియుని కుశలవార్తను వినినతోడనే, మరల నాబ్రదుకునందాసగలదాననైతిని. ఏదైననొక మహావ్యాధిచేఁ బీడింపఁబడుచు బ్రాణములయందాసవదలిన వారొక మహౌషధము సేవించుటవలన నాబాధనుండి తొలఁగింపఁబడినవారై మరల జీవితమందు నమ్మకముగలవారగుదురు. అట్లేప్రియుని శుభవర్తమాన మీమెకు మహౌషధ మయ్యెనని తాత్పర్యము. కావున నింక నాభర్తయొక్క కుశలవార్తా వివరణమువలన రోగికి పథ్యాహారముల నొసంగి జవసత్వాదుల గల్గించినరీతిగా, నాదుఃఖభరముచేఁ గలిగిన దౌర్బల్యమును పోఁగొట్టి నాకు సంతోషాతిశయ మొనగూర్పఁ దగియున్నాఁడవు.

« ప్రాణేతస్తా... వార్తాం » అనునది మేఘుఁడు 10 వ శ్లోకమునఁ జెప్పియున్న కల్యవార్తయు యక్షునిచేఁ జెప్పఁబడిన « భర్తుర్మిత్రం ప్రియమవిధవే » (ఉ. మె. 38) యనుశ్లోకముయొక్క సారాంశమై యుండునని తెలియుచున్నది. « ప్రాణనాథస్య » యను విశేషణ మీయక్షుఁడు తనజీవితమునకు నాధుఁడు గాన తగుకాలమున (ననగా వర్షాకాలము విరహులకుఁ గడు దుస్సహమగుటవలన) జీవనప్రదుఁడగు జీమూతునిద్వారా స్వకుశలవార్తను దెల్పఁబూనుటవలన ప్రాణదానావశ్యకమగు సమయమును దెలిసినవానివలె గన్పట్టుటచే సార్థకము నొందుచున్నది. « ప్రగతవిలసజ్జీవిత ప్రత్యయా » ఈమె జీవితము పూర్వ మేఘమున యక్షుఁడు చెప్పినట్లుగా « కుసుమసదృశ » మై « సద్యఃపాతి » అప్పుడేరాలిపోవుటకు సిద్ధముగానుండగా, పరదేవతా ప్రీత్యర్థము, తరువు వెందలగువానివలన గలిగిన యాశాబంధ మాపినది

కాని యిప్పుడు తనభర్త కుశలవార్త వినినతోడనే తనజీవితమందును నిశ్చయమగు నమ్మకము పుట్టినది. "శ్రుత్వా" ఈశ్రవణలాభము "కాంతోదంతః సుహృదుపనతః సంగమాత్కించిదూనః" అని (ఉ. మే. 39 శ్లో.) మేఘుఁడే చెప్పియున్నాడు. ఈయక్షాంగనయుదాని ననువదించుచున్నదివలెనున్నది. "ప్రమదచరితా" యనుటవలన తనభర్తకే యేవిషయములు సంతోషమును గలుగఁజేసినవో యవియె-వానికథనముచే-విరహార్తయగు తనకు పథ్యముగనె నుపచరించును. అవియే యామెకు సంతోషకరములగునని తాత్పర్యము. ఇట్లనుటవలన నీవియోగసమయమున వానిస్థితి యెట్లుండెనో యతఁడెట్లు కాలము గడపుచుండెనో తెలియఁగోరు నామెపాతివ్రత్యమును వెల్లడిఁజేయుచున్నది.

శ్లో॥ నేతుర్మే తే ప్రియసచివతా ప్రాక్కథంకారమాసీ
త్తచ్చేత్తస్యాఽవిదితమపి తే వృత్తమిత్యేవమన్యే
తస్మాచ్చంద్రస్స్వకరసుధయా వాసరార్తాం చకోరీం
ప్రేమ్ణా మే మాం రమణ కథయా నేతుమర్హస్యతాపం ॥౧౨॥

ఉ॥ నీకును నాదుభర్తకును స్నేహముగల్గుట యెట్లు స్నేహమే
నీకులభించెఁ దచ్చరిత నిక్కముగా విదితంబగాన, నా
ప్రాకటమైన తచ్చరితఁ బార్వణచంద్రుఁడు వాసరార్తనా
కాకఁ జకోరిసాకినటుగా వగ నన్ను వచింపవేడెదన్॥

అర్థము. మే = నాయొక్క, నేతుః = భర్తకును, తే = నీకును, ప్రాక్ = ఇదివరకు, ప్రియసచివతా = గాఢస్నేహము, కథంకారం = ఎట్లుగా, ఆసీత్ = ఆయెను. తత్ చేత్ = అట్టిప్రియస్నేహమున్నయెడల, తే = నీకు, తస్య = ఆనాభర్తయొక్క, వృత్తం = వృత్తాంతము, అవిదితం అపి = బాగుగాఁదెలిసియే యుండును. (అని) ఇత్యేవ = ఈలాగుననే మన్యే = తలఁచెదను. తస్మాత్ = అందువలన, చంద్రః = చంద్రుఁడు, స్వకరసుధయా = తనకిరణామృతముచేత, వాసరార్తాం = పగటియందుబాధనొందిన, చకోరీమివ = చకోరాంగనవలె, మాం = నన్ను, రమణ

థయా = భర్తృకథచేత, ప్రేమ్ణైవ = ప్రేమచేతనె, అతాపం = దప్పిదన ముసు, నేతుం = పొందించుటకు, అర్హసి = తగియున్నావు.

తాత్పర్యము. నాప్రాణనాయకునికిని నీకునిదివరలో నిట్టిసాంగత్య మెట్లుగలిగినది. నాభర్తకు ప్రియమైన స్నేహితుఁడవైన పక్షమున వానివృత్తాంత మంతయు నీకుబాగుగఁ దెలిసియే యుండును. అందువలన నీవు, చంద్రుఁడు, పగలంతయు తన నెడబాయుటచే బాధనొందుచున్న చకోరాంగనను, తనకిరణామృతము నిచ్చి పోషించినటులనే నాకునీవు నాప్రియుని వృత్తాంతమును జెప్పి నాతాపమును పోగొట్టుటకు బాగుగ తగియుందువు. చంద్రుఁడమృతకరుఁడగుటచే పగటియందు మాత్రమే బాధనొందు చకోరాంగనలకు తనకరంబులనాహారంబుగ నిచ్చిప్రోచినట్లునీవునురేయింబవళ్లు వియోగతాపముచేఁ బరితపించుచున్న నన్ను నీవు నమృతకరుండవగుటచే (ఉదకముగల్పించువాఁడు) ప్రియుని వృత్తాంత కథనముచే నాతాపోపశమనంబుఁ జేయనర్హుఁడవని తాత్పర్యము. చకోరములు వెన్నెల పులుగులు. అవి రాత్రులయందు వెన్నెలనుతిని బ్రదుకుననుట శాస్త్రప్రసిద్ధము. "ప్రియసఖితా" సమానవయస్కులగు వారలకుఁ గలుగుస్నేహము సఖిత, అది భిన్నవయస్కులగు వారల స్నేహముకంటె నెక్కుడు పట్టుగలది. అట్టి సర్వసౌహృదముగల్గుట వలననే యక్షుఁడీ వార్త వీనిచే నంపియుండునని తెలిసికొనినదానివలె నీయుక్తి కన్పట్టుచున్నది. "కథంకారం" అనునది రామాయణమున హనుమత్సందేశము విని జనకాత్మజయడిగిన "క్వ తే రామేణ సంసర్గః కథం జానాసి లక్ష్మణం వానరాణాం నరాణాం చ కథమాసీత్సమాగమః" అను ప్రశ్నను తలపించుచున్నది. మేఘసందేశమున నాయకుఁడు "హరశిరశ్చంద్రికాధౌతహర్మ్యా" "ఇందోర్దైన్యం... బిభర్తి" "పాదానిందోరమృతశిశిరాన్" "పరిణతశరచ్చంద్రికాసు" ఇత్యాదుల పలుమారు చంద్రసామాన్యముఁ దెచ్చుటవలనను "(హరశిరశ్చంద్రికాధౌతహర్మ్యా" యని చెప్పుటవలన,) వీరికెల్లపుడు చంద్రసహవాసము గలుగుట సూచించుచు నిచ్చట నీకవి యక్షాంగనవాక్యముల ద్వారా దానిని దృఢపఱచుచున్నట్టు కన్పట్టును. "అతాపం" ఉత్తరమేఘమున యక్షుఁడు తనప్రియురాలట్లు సహితయై తనవార్త విసుటకు కారణముగా

"కాంతోదంతస్సుహృదుపనతస్సంగమాత్కించిదూనః" (ఉ. మే. ౩౮
అని చెప్పియున్నాడు. ఇప్పుడీ మెయునట్లనే తలంచెదని తోచెడిని.

శ్లో॥ స్యాచ్చేత్తథ్యేతరవచనతా తేహితాశః ప్రియో మే
తత్తద్వృత్తం రహసిజనితం కిం వదేత్ప్రత్యయేన
తస్మాత్తస్యస్థితిమవిరతం సాధుజానాసిసాధో
నిశ్శంకం మేవద వివిధమప్యద్యతత్ప్రీతిదం స్యాత్ ॥ ౧౮

చ॥ అనృతములాడు దేనియు, రహస్యములన్నియునీకు జెప్పునా?
ననుబ్రతికింపనిన్నిటకు నాధుఁడు పంపున? కాన లెస్స నా
ధునిచరితంబునీకెఱుక దుఃఖమొ? తోషమొ? కూర్చుగాకశం
కనువిడిచెప్పుసత్యమును, గౌతుకమయ్యెడినాకు నో ఘనా ॥

అర్థము. తే = నీకు, తథ్యేతరవచనతా = అబద్ధమాడుట, స్యా
చ్చేత్ = అయినట్టయితే, (అనగా నీవబద్ధములాడువాడవైతే) హితాశః =
తనకు నిష్టమైన యాశగలవాఁడగు, మేప్రియః = నాభర్త, రహసి = ఏకాం
తమున, జనితం = జరిగిన, తత్తద్వృత్తం = ఆయావృత్తాంతమును, ప్రత్య
యేన = నమ్మకముతో, కిం వదేత్ = చెప్పునాయేమి, తస్మాత్ = అందువలన,
సాధో = ఓయియోగ్యుఁడా, తస్య = వానియొక్క, స్థితిం = ఉనికిని, అవి
రతం = ఎడతెగకుండఁగా, సాధు = బాగుగ, జానాసి = ఎఱిగియుందువు,
మే = నాకు, నిశ్శంకం = సంశయములేక, వద = చెప్పుము. తత్ = అది,
వివిధమపి = ఎట్టిదైనను, అద్య = ఈసమయమందు, ప్రీతిదం = సంతోషక
రము, స్యాత్ = అవును.

తాత్పర్యము. నీవు అబద్ధము లాడువాఁడవైనచో రహస్యమైన యా
యావృత్తాంతమును, నాహితమునుగోరు భర్త నీకట్లు నమ్మకముతోఁ జెప్పియుం
డును. కనుక నీవతని యథార్థమగు వృత్తాంతమునంతను సాకల్యముగ నెఱిగి
యుందువు. ఓయోగ్యుఁడా నాప్రియుని వషవడి నాకు సంతోషముఁ జేయు
నదైనను కానున్నను సంశయింపక యావత్తు చెప్పుము. అది యెట్టిదైనను
నాకీసమయమందున సంతోషమునే చేయును గాని విరుద్ధముగా నేరదు.

ప్రథమపృష్ఠః.

"హితాశః" మేఘునిచేత తనశుభస్థితిఁజెల్పఁగాని తనకాంత జీవింపనేర దని నమ్మినవాఁడై, యిట్లు మేఘునిచే నీవార్తఁబంపినవాఁడు గనుక నే హిత ముగు యాశయము గలవాఁడగుచున్నాఁడు. అందువలన నీరహస్య వృత్తాం తములగూడ వీనికిఁ జెప్పియుంపెను. ఇట్లీమె చెప్పుటచేత తనయందంత ప్రేమ గలవాడని తెలిసి "దయితా జీవనాలంబనార్థీ...త్రిం" అను మేఘ సందేశమందలి వాక్యమును మారువలుకుచు నున్నట్లున్నది.] "సాధో" యనునది మేఘుఁడు విశ్వాసపాత్రుఁడై, లోకోపకార మకారణముగనే (ఒక రియపేక్ష లేక వర్షాదులనిచ్చుటచే) జేయుసమర్థుఁడని చాటుచున్నది. ఆమెకు వీనియందుఁగల గౌరవాతిశయమును వెల్లడించుచున్నది. "నిశ్శంకంవద" అనుటవలన యక్షుఁడు మేఘునితో నడ్డములేక లోనికి ప్రవేశించి వర్తమాన ముఁ జెప్పుమనినట్లీమెయు ప్రియోదంతశ్రవణ కుతూహలముచే ప్రియాభిప్రా ప్రాయాను సారిణియైనట్లు స్పష్టీకరించుచున్నది.

"వివిధమపి" భర్తయొక్క నడవడి యేకాంతముగా నుండుటచే నన్య స్త్రీలోలత్వాది వ్యాపారములు గలదైనప్పటికి జడియక చెప్పుమనుట

"తత్ప్రీతిదం" అనుటచే భర్తృసౌఖ్యము నే సదా కోరుచుండుటచే నాధుండన్యకాంతాసక్తుఁడైనను వానియందనూయాదులు లేకుండునట్లు కనబడు టవలన నీమె పాతివ్రత్యము విశదీకృతమగుచున్నది.

శ్లో॥ నష్టంహ్యానే శ్రవణ పదవీసంప్రవిష్టంనిపేవ్య
ప్రాణాన్ధర్తుంరమణ చరితంసాధువీయూషమద్య
తస్మాత్పత్యుర్విరహవిధుతం జీవితంసాంప్రతంతే
కర్తుంయుక్తంస్థిరపరిచితం సాంప్రతంయదవ్యశంతే ॥ C.F.

చ॥ చెడినదిమానసంబిపుడు నేకురభర్తృకథామృతంబుదాఁ
గడువడిఁబ్రాణముల్నిలువఁగా దలపోయుచు నుండెనాథుప్రే
ముడినిఁగృశించి, నీచెలిమిఁబొందియు, జీవితమిప్డునిశ్చలో
బడెనొ, నుపేక్ష సేయఁదగవా బ్రతికింపఁగదోయి మేఘుడా ॥

అర్థము. నష్టం = చెడిపోయిన, మేహృత్ = నామనస్సు, శ్రవణపద వీసంప్రవిష్టం = శ్రోత్రమార్గమునుపొందిన, రమణచరితం = భర్తృవృత్తాంత మనెడు, సాధు = యోగ్యమైన, పీయూషం = అమృతమును, అద్య = ఇప్పుడు, నిషేవ్య = సేవించి, ప్రాణాన్ = జీవమును, ధర్తుం = వహించు టకు, యతతే = (అనెడు పదమధ్యాహారము) యత్నించుచున్నది. తస్మాత్ = అందువలన, పత్యుః = భర్తయొక్క, విరహావిధుతం = వియోగము చేఁబాధపడినట్టియు, సాంప్రతం = ఇప్పుడు, స్థిరపరిచితం = బాగుగపరిచ యముఁగలదై, తే = నీకు, వశంయత్ = ఏదియధీనమైనదో అట్టియు, జీవితం = ప్రాణము, యుక్తం = శరీరముతో గూడినదానిగా, కర్తుం = చేయు టకు, సాంప్రతం = తగినది.

తాత్పర్యము. నామనస్సు భర్తృవియోగమువలనఁ జెడిపోయినది. కాని నేనిప్పుడు వానివృత్తాంతమనెడి యమృతపానముఁజేసి బ్రతుకదలఁచు చున్నాను. అట్లుచెడిన నామనము నీయందధీనంబయ్యెఁ గావున నంతపరిచ యము గలదాని నుపేక్షింపఁజనదు. కావున నన్నుఁబ్రదికింపుము. "నష్టం హృత్" భర్తృవియోగముచే బాహ్యవిషయాసక్తి మఱచుటెగాక, మనస్సి ప్పుడు భర్తృనిష్ఠమగుటవలన నాంతరిక వ్యాపారశూన్యంబు నయ్యెననుట. "స్థిరపరిచితం" ఆమె, రమణకథాస్వాదనమునను జీవింపఁబడి, మేఘుఁడుచెప్పు వర్తమానము వినుట యందత్యంత కుతూహలముగలదయ్యెను. అందువలననే "వశం" ఆమెమనస్సు మేఘుని యధీనమయ్యెను. ఈమెమాటలకు సరిగ నుత్తరమేఘమున యక్షుఁడు "ఉత్కంఠోచ్ఛ్వసితహృదయా" శ్లో పృథ్యస్మాత్వ రమవహితా" (ఉ. మే. 39 శ్లో) అని చెప్పియుండుటచే, వీరొండురుల భావ ముల బాగుగఁదెలిసికొని యుండిరనియు నందువలన వారియన్యోన్యమున భేద చింతయు వ్యక్తమగుచున్నది.

శ్లో॥ ఏవంతస్యాంమృదులవచసీత్యుక్తవత్యాంయువత్యాం
సౌహార్దాంచన్మతిధృతి తయాసంగతప్రశ్రయోసౌ
భాస్వల్లిక్షిష్టామిపకుము దినీంసమ్మదంసంప్రణేతుం
చకోరైర్జైవాత్రృక ఇవతదాగాస్సుధామాధురీకాః ౨౦.

చ॥ మృదులములైనవాక్కు లిటులింపుగఁ బల్కఁగ, యక్షకాంతవా
రిదముప్రమోద ధైర్యముల వృద్ధిని జెందినబుద్ధి, నమ్రితన్
బాదలుచుఁ బ్రొద్దువేఁడిమికిఁ బోడిమివీడినఁ గల్వరాజనా
నదయతఁ గోసుధాతతులఁ జల్లెను బెల్లుగ నుల్లసిల్లఁగన్ ॥

అర్థము. తస్యాంయువత్యాం = ఆయక్షకాంత, మృదులవచసి = మార్దవముగల వాక్కులుగలదై, ఏవం = ఇట్లు, ఉక్తవత్యాం = చెప్పినదగుచుండగా, సౌహార్దాంచన్మతిధృతితయా, సౌహార్ద = స్నేహముతో, అంచత్ = ఒప్పుచున్న, మతిధృతితయా = బుద్ధిధైర్యములు గలవాఁడగుటచేత, సంగతప్రశ్రయః = ఒప్పుచున్న యడకువగలవాఁడై, అసౌ = ఆమేఘుఁడు, ఘస్రక్లిష్టాం = సూర్యకాంతివలన వాడిపోయిన, కుముదినీం = కలువతీగను, జైవాతృక ఇవ = చంద్రుఁడువలె, సమ్మదం = వికాసమును, సంప్రణేతుం = చేయుటకు, తదా = అప్పుడు, సుధామాధురీకాః = అమృతమువలె మధురములగు, గావః = కిరణములవలెనున్న వాక్కులను, చక్రే = చేసెను. అనగా చెప్పెననుట.

తాత్పర్యము. ఇట్లాయక్షకాంత మృదువులగు వాక్కులతో నామేఘునకు నమ్మకముపుట్టించుచు మాటలాడగా, నామేఘుఁడు వృద్ధినొందిన స్నేహమును మనోధైర్యమును గలవాఁడై యడఁకువగలిగి, పగలు సూర్యకాంతిచే వాడిపోయిన కలువతీగను చంద్రుఁడు తనయమృతంపు కిరణములతో వికసింపఁజేసినట్లు, అమృతంపు తేటలను తనమాటలచే విరహార్తయై కృశించిన యామెను సంతోషముఁజేయుచు నిట్లనియె. "మృదులవచసి" పూర్వశ్లోకములయందు ప్రియోదంత వివరణమును, వియోగతాపోపశమనార్థిత్వమును, వివిధప్రియ వార్తాశ్రవణకుతూహలంబును, జీవితదానమునుం గ్రమంబుగఁ గోరుచు, వినయానునయపాతివ్రత్యదైన్యాదులనూచించుటచే, నామె వాక్కులం దమృదుత్వారోపణ చేయంబడియె. "సౌహార్దాంచ...తయా" మొట్టమొదట నాయక్షిని దేవఁడో యని శంకించినదై విముఖియగుటవలన మేఘుఁడు కొంతసంకోచించినవాడైనను, ఇట్టియామెవాక్యముల వినినతోడనే, స్నేహాతిశయమున

దాఁజెప్పఁబోవుహార్దిఁ జెప్పుటకు ధైర్యమును వానిమనమున జనించినని. కాని "సంగతిప్రశ్రయః" అడఁకువమాత్రము విడువలేదు. మఱియునిది దాత్య లక్షణము "జైవాతృకః" అనునది జీవనదాతయందును ప్రసిద్ధముగాన, సూర్య తాపక్లిష్టమగు కలువతీగను చంద్రుఁడు వలెనే, వియోగతాపఖిన్నయగు నాయకికి కుశలవార్తఁ జెప్పి ప్రాణదానముఁ జేసి రక్షించుట సహజమని తాత్పర్యము. "గాస్సుధామాధురీకాః" పరునిచే బాధపెట్టఁబడిన కుముదిని చంద్రుని కరస్పర్శనమున నెట్లుప్రకాశించెనో అట్లె "కాంతోదంత...కించిదూనః" అని యక్షుఁడు చెప్పినట్టి మెను వీనిమాట లమృతప్రాయములై నిర్వృతఁ జేయునని తెలియుచున్నది.

శ్లో॥ యత్త్వేప్రేయాన్ స్వయిసదయయాగాత్తనూజత్వభావం
దూరేతస్మిన్నపిచభవసిప్రేమ ధూర్నిర్భరాత్మా
నూనంతస్మాదహముపగతో న్యాయతస్తాతభావం
పుత్రంమత్వాతవహృదయసంభాషణం నిర్విశంకా॥

చం॥ ననుసుతుఁడంచుఁ బ్రేముడిమనంబున నెంచెను, నీప్రియుండు నీ
వునుఁగడుదూరముండియును, బుత్రునిరీతిని బ్రేమఁజూపనా
కునుదలపంగఁబాడిజనకుండ వలెనీ పతిఁజూడనన్ను నం
దనునిగనెంచినీమదిని దల్లిరొశంకనుమానిపల్కుమా ౨౧.

అర్థము.—యత్ = ఏహేతువువలన, తే = నీయొక్క, ప్రేయాన్ = భర్తయగు, సః = ఆయక్షుఁడు, దయయా = కరుణచేత, మయి = నాయందు, తనూజత్వభావం = పుత్రుఁడనెడితలంపును, అగాత్ = పొందెనో, తస్మిన్ = అట్టినీభర్త, దూరేఽపిచ = దూరమందున్నను, ప్రేమధూర్నిర్భరాత్మా = ప్రేమాతిశయముచేనిండినమనస్సుగలదానవు, భవసి = అగుచున్నావో, నూనం = నిశ్చయముగ, తస్మాత్ = అందువలన, అహం = నేను, న్యాయతః = న్యాయముగనే, తాతభావం = తండ్రియనెడునభిప్రాయమును ఉపగతః = పొందినవాఁడను, (కావునన్ను) పుత్రం = కుమారునిగ, మత్వా = తలఁచి, తవ = నీయొక్కహృదయ, సంభాషణం = మనస్సునందలిమాటనుగూర్చి, నిర్విశంకా = సందేహములేనిదానవు. భవ = కమ్ము.

తాత్పర్యము.—నీభర్తయగు యక్షునికి నాయందు పుత్రప్రేమగలిగినది ఆతనిదూరమందున్నను, మత్ప్రియుఁడగు వానియభిప్రాయముఁ దెలిసికొనిన దానివలెనే నీవును నాయందు, పూర్ణమగు వాత్సల్యముఁ జూపించుచున్నావు. కనుక భార్యాభర్తలగు మీరిరువురు నాయందు సమానమగు పుత్రవాత్సల్యముఁ జూపుటవలన నాకు యక్షునియందుఁ గలిగిన పితృభావము న్యాయముగనే యున్నది. అందుకని యీపుత్రభావము స్థిరపఱుప, మనమున నెంతమాత్రము సంశయింపక నీమనస్సులోని మాట చెప్పుము. "నిర్వ్యాశంకా" పూర్వమున నామెకుఁ గలిగిన చోరాద్యనుమానముల మనమున నుంచక, యక్షుఁడు తనయందు తనూజత్వభావము గల్గియుండుటవలన (ఆత్మావై పుత్రనామాసి యను శ్రుత్యర్థమనుసరించి) వానిస్వరూపముగనే యెంచి వెనుకతీయక రహస్యసంభాషణాదికము జఱుపుమనుట.

శ్లో॥ జల్పంతంతంనిజచరణ యోస్సంపతంతంయదృచ్ఛా
నారాకారంవినయ భరితంసాపయోదంనిరీక్ష్య
ఉత్తిష్ఠంతీశయనతలతః ప్రేమపూర్ణాంతరాత్మా
పశ్యంతీతందినకరకరస్ఫారనీరేజనేత్రా ॥

చ॥ తనపతివార్తనిట్లు విశదంబుగఁ జెప్పుచునారరూపముం
గనివినయంబునం నతులనంతముగా నొనరించుమేఘునిం
గని, దిగిసెజ్జ, నానినటఁగాంచెను, బ్రేమరసోదితాత్మయై
దినకరచారుసారఘృణిదీపితపద్మపలాశనేత్రయై ॥ ౨౧.

అర్థము.—సా = ఆయుత్తమాంగన, జల్పంతం = ఇట్లు చెప్పుచు, నిజచరణయోః = తనపాదములయందు, సంపతంతం = పడుచున్నటువంటియు, యదృచ్ఛానారాకారం = కామరూపుఁడగుటచే నరకరూపధారియయినట్టియు, వినయభరితం = అడఁకువతోఁగూడినట్టియు, పయోదం = మేఘుని, నిరీక్ష్య = చూచి, శయనతలతః = పక్కనుండి, ఉత్తిష్ఠంతీ = లేచినదగుచు, తం = ఆమేఘుని, ప్రేమపూర్ణాంతరాత్మా = ప్రేమచేనిండినమనస్సుగలదై, పశ్యంతీ = చూచుచు, దినకర = సూర్యునియొక్క, కర = కిరణములచే, స్ఫార = వికసిం

చిన, నీరేజ = పద్మములవంటి, నేత్రా = కన్నులుగలదగుచు, తస్థౌ = ఉండెను. ఇది అధ్యాహారము.

తాత్పర్యము.—ఇట్లు చెప్పుచు నామేఘుఁడామె పాదములమీదఁబడి వినయముతో నామెకు నమస్కరించెను. ఇచ్ఛాధీనమగు స్వరూపముఁగలవాఁడు సుదకరూపుఁడునైన యామేఘునిఁజూచి తానుపడుకొనియున్న శయ్యనుండి లేచినదై, పరిపూర్ణమగు ప్రేమగలదగుచు, సూర్యకిరణముల తాపచే బాగుగ వికసించిన తమ్మిరేకులవలె ప్రకాశించుచున్న నేత్రములతో వానిని జూచెను. "చరణయోస్సంపతంతం" నమస్కరించుటవలన మేఘుఁడు తన వినయగౌరవాదికమును వెల్లడించుటేకాక, తనపుత్రభావము నంగీకరించి నిశ్శంకముగ నీభర్తవిషయమగు వార్తఁ దెలిసికొమ్మని వేడుకొనుచున్న వానివలె నున్నాడు. మాతాపితలకు గురుదైవములకు సాష్టాంగ నమస్కారము ధర్మశాస్త్రవిహితముగాన, తల్లిగా భావించిన యామెకు సాష్టాంగనమస్కారము చేయుటచే వెనుకటిశ్లోకమునఁ జెప్పినమాటను క్రియారూపమున గూడ సమర్థించినాఁడు. "యదృచ్ఛా" అనునది మేఘుఁడేసమయమున నేరూపము కావలెనన్న నారూపము ధరింపగలండని సూచించుచు "కామరూపం" అను యక్షునిమాటను స్మరింపజేయుచున్నది. "స్ఫారనీరేజనేత్రా" ఇది వలపు కన్నీళ్లతోనిండి వాడియున్న యీమెకన్నులు, మేఘునిఁజూచుటవలనను, ఆమేఘుఁడు తనపాదములమీదఁబడి సానుభూతిని విశ్వాసమును జూపుటవలనను, వీనియందలి ప్రేమాతిశయముచే నామెకన్నులు విప్పారినవి. ఈవిశేషణము ఉత్తరమేఘమున యక్షుఁడు చెప్పిన "త్వయ్యాసన్నే నయనముపరిస్పందిశంకే మృగాక్ష్యాః, మీనక్షోభాచ్చలకువలయశ్రీతులామేష్యతీతి" (ఉ. మే. 34 శ్లో.) యనుమాటను జ్ఞాపకము చేయుచున్నది.

శ్లో॥ దాక్షిణ్యంహి ప్రవిదితగుణః పూరుషాణామజస్రం
మూకప్యేయం త్వదృతకథ నాత్ప్రత్యయాన్నామకీన
సల్లాపేత్వంగళిత వికయస్సత్య మే వానుయాత
వ్యస్యావస్థాంకథయనకలాం వంచనీయాస్మినాస్మి॥